# వింత పద్యములు.

ఇది

వెంపటి వేంకటనారాయణచే

రచియింపఁబడి

ఏలూరు.

రామా ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడెను.

1917.

[కాపీరైటు] దీని వెల రు 0—0—6 లు. [రిజిష్టరు]



సంస్కృతాంధ్రగ్రంధములు నాటకములు, నవలలు, హాస్యగ్రంధములు, వైద్యగ్రంధములు, జ్యోతిషగ్రంధములు వగైరాలను వలయువార లీదిగువనుదహరించిన వారిపేర వ్రాసి తెప్పించుకొనవచ్చును.

వెంపటి వేంకటనారాయణ,

వాణీగ్రంధాలయం,

ఏలూరు, కృష్ణాజిల్లా.



శుభమస్తు.

దక్షిణామూర్తిపరబ్రహ్మణేనమః.

# వింతపద్యములు.



చ. తెలిసినయంతవట్టునకు దేవునిపై
దగఁభారముంచి యీ
యిలఁగలచర్యలెల్ల నొకయించుక
వ్రాయఁగఁబూని నాడనిం

దలఁ దలమోపి భ్రష్టుఁడని దా
ర్కొని నన్నిఁకఁ దిట్టఁబోకుఁడి
యలఘుచరిత్రులార కరుణాన్విత
భూషితులార యిమ్మెయిన్. 1

గీ. జోలిలోపల కొరకంచుఁబోలెఁబణ్య
కులజులనెఱుంగకుండఁగ క్రూరమతులు
గోరివిత్తంబుఁగోల్పోయి కుందుచుంద్రు
నీచదశయందుఁ గృశియించి నీల్గుచుంద్రు. 2

---

3

ఉ. వారవిలాసినీ మమతవర్తనమున్
వినయోక్తులెంతయున్
నేరకమత్తులై విటులు నీరజ
నేత్రలఁబాసి వేశ్యలం
గోరిసమస్త సంపదలఁ గోల్పడి
దార్ఢ్యతఁదప్పియొందరే
ధారుణియందు న్యూనతను
దాలిచి భోగులు జోగులైరొకో.

గీ. ధనముఁ గలవాని వయసునఁదనరువాని
కులుకుగలవాని బల్‌హొరాయల్ గలుగువాని
నుతకు చేకూర్చియటుమీద సోకడంచి
వెడల నడపించు యమదూత వేశ్యమాత. 4

సీ. విటకాండ్రవలపించి చిటికలోమఱపించి
కుఁచించి కొంపలమ్మించి మించి
ప్రేముడిదేలించి భూములబోకార్చి
సర్వంబుగ్రహియించి చలముపెంచి



యనురాగమునముంచి ధనముఁబ్రియమునూడ్చి
సాగఁదోలించి ప్రశాంతిగాంచి
నిందలదూలించి మందులపోలించి
తుదకు భిచ్చపుచిప్ప కదియనిచ్చి

గీ. కలఁత పాజ్లేయుకుటిలలుగణి కలౌదు
రనియెఱింగియు వారలననుసరించి
మానమభిమాన మిసుమంతయైన లేక
మోసపోవుచునుందురు మూర్ఖమతులు. 5

6

గీ. విటులసేవ్వ నలాలించి విత్తమెల్ల
నూడ్చి పరదేశ వాసిగా నొనరఁజేసి
మరల నొకనినిఁదరిఁజేరి సరసగతుల
దనుపుచుందురు ప్రేమడి గణికలరయ. 6

సీ. కలిమికాసించినఁగు వలపు హెచ్చించియు
ప్రేల్మిడి ధనమునార్జించుమిగుల
రావించియింటికి భావించి రెంటికి
చెడఁగొట్టి ధనమునార్జించుమిగుల

---

7

మాయల మసిబూసి హేయంబునకు ద్రోసి
చెలువొంద ధనమునార్జించుమిగుల
ద్వేషించియంతనే భాషించి వెంటనే
మంచిగా ధనము నార్జించు మిగుల

గీ. ఆహా! వెలయాంధ్ర కెంతటి సాహసంబొ
చెలఁగి నెత్తురు పీల్చెడి జలగలార
భోగినైనను క్షణములో జోగిఁజేసి
వెడలనడపింతురి విటులను వేశ్యలకట. 7

చ. అటునిటుసంచరించి విటులందఱిఁ
జేరఁగఁదీసి ప్రేముడిన్
బహుతరక్రీడలన్దనిపి స్వాంతమురంజి
లఁ జేసి ద్రవ్యమున్
కుటిలపు వేశ్య యూడ్చి తలకుం
దగినట్టి కుళాయిదీర్చి వే
సటఁగలిగించి యయ్యకును క్రన్నన
సాగఁగఁదోలు క్రూరతన్. 8

9

చ. ధనమునసించు దేహమున దా
ర్ఢ్యతతగ్గును బంధుకోటియుం
గనినహసింత్రు దుష్టునిగఁగాంతురు
లోకులు స్నేహపాళియుం
గనుఁగొనరాదు ! పణ్య కులకాంతల
కూటమి నిన్ని కష్టముల్
దనరును రోగపీడనము దారొకను
కాంతిహరించు నంతకున్. 9

# 10

గీ. ఇట్టికష్టంబులకు దగహేతువైన
వెలవెలందులకూటమి విడచి మిగుల
భాగ్యభోగ్యంబులంగని ప్రథితకీర్తి
గాంచి వర్ధిల్లుడీక మీఁద నంచితముగ. 10

ఆ. వె. ఇంతదనుక వేశ్యలెన్ని మాయలఁబన్ని
పదులు వందలనకఁ గదసి విటుల
పొందుఁగూడి విత్తమునునూడ్చి కులవృత్తి
విడువకుండ వేడ్క నడపుచుండ్రి. 11

---

# 11

శా. ఈకాలంబున వారకాంతలకు
దిక్కే లేమ సంసారులే
వీకంజూచిన నిండికెల్లెడల నీ
వేశ్యాంగనా గర్వముం
బోకల్ సాగవు పాటకా
సొగసుకా ముచ్చట్లకా కుచ్చులం
గాకా పావడకా విలాసమునకా
కాంతల్సరిన్ బోలఁగన్. 12

గీ. ఔం వెలయాంధ్ర సిరిజూచి యబ్జభవుఁడు
గాసివెట్టఁగ మదినూహఁచేసిచేసి
మించివ్యభిసారికల సృజియించిమిగుల
వారకాంతల వంతలపాలుపరచె. 13

క. ఇలువెడలి వెలికివచ్చిన
కులకాంతలుఁ గూటికి మఱి గుడ్డకుఁగరవై
మలమలమాడుచు వ్యాధుల
నెలవులగుచు క్షీణదశను నిల్తురుసతమ్మున్. 14

క. పతినెడబాసిచరింపక
పతికనుకూలంపుగతిని వరలుచుసతమ్మున్
పతిపాదపూజ సల్పెడి
సతులకుఘనయశము మోక్ష సాధనమరయన్. 15

సీ. పతిభక్తిపరలౌచు క్షితికులాంగనలెమ్మిఁ
జిరకీర్తివహియించి వరలుగాత
చంచలస్వాంతలై చనకసతీధర్మ
వర్తనులై గడుఁబ్రబలుగాత

మఱదులనత్తమామలకడ నణఁకువ
గాఁజరింపుచుఁ గూర్మిఁగాంత్రతుగాత
పెరవారిఁ దనవారి నరయుచునొకరీతి
భాగ్యభోగ్యంబులఁ బడయుగాత

గీ. పతులుసతులును నేతరిఁ బాయకవని
ధర్మమార్గాను సరణము దప్పకుండ
బుధులసన్మానమునుగాంచి పొలుపుమీఱఁ
బుత్రపౌత్రాభి వృద్ధినిఁ బొదలుగాత. 16

వింతప[illegible]ము.